


శ్రీరస్తు.

# స్త్రీల వేడుక పాటలు

ఇవి.

పరవల్లిపురవాస్తవ్యులును, శ్రీముని వరాహణాపేక్షా
ర్థివేశ్వరప్రసాదలబ్ధ సంగీతసాహిత్యాధురీణులును;
ప్రియమోక్షకుంతలాదినాయనాటక
రచనాపరిశారదులునగు

బ్ర॥ గూడ కృష్ణయ్యగారిచే

స్త్రీజన మనోహరముగ రచియింపబడి
బహుజన ద్రవ్య సహాయమునను
భూలోక ధర్మప్రియునగు
బాపట్ల కేకేర్న
మ॥రా॥రా॥శ్రీ॥ అలపర్తి నారాయణస్వామి
నాయునిగారి వాగ్దానమ్ము
క సహాయమునను
మ॥రా॥రా॥శ్రీ కొమ్మూరి పుల్లయ్యగారి
స్వకీయ

శ్రీకన్యకాపరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపబడియె.
బాపట్ల Bapatla
1910. దీని వెల 0—8—0.

# ప్రకటన.

చదువరులారా!

మొదట నేఁ గొన్ని రామభజనకీర్తనలును, నీ పాటలను, జేర్చి ముద్రింపించవలెనని యత్నించితిని. నా స్నేహితులు కొందఱు కీర్తనలును, బాటలును, నొక్క పొత్తముగఁ జేర్చుట యనుపయోగమని బోధించుటచేత ను, కొందఱు సతీతిలకములును యట్లే యనుటవలనను, కీర్తనలను బ్రస్తుతముమాని పాటలమాత్రము ముద్రి యొందించినాను. స్త్రీలకును, బురుషులకునుగూడ సర్వకార్యములయందును మంగళహారతు లుపయోగకరములగుటచే ముప్పదినాలుగు మంగళహారతు లిందులిఖించి కొందఱియభిప్రాయానుసారముగాఁ బువ్వుబంతిపాటలు కొన్ని యిందు వ్రాసినాను. మఱియు తలుపుదగ్గరపాటలు, వసంతపాటలు, మొదలగునవియు నిందుఁ గలవు. సాధ్యమయినంతవఱకు వాటివాటి రాగములును, కొన్నికొన్ని మట్లును, పొందుపఱచినాను. కావున వీటిని చదువనభిలషించు యోషిజ్జనంబులు ఘణుతులు గుర్తెఱింగి సాధ్యమయినంతవట్టు చదువఁగలందులకు నభిలషించుచున్నాను.

ఇట్లు,

గూడె కృష్ణయ్య.



శ్రీ.

గణాధిపతయేనమః

శ్రీమనుమాగణపతి పార్థివేశ్వర దేవతాభ్యోనమః

1. విఘ్నేశ్వరమంగళహారతి:—నాథనామక్రియ. ఆట.

మంగళమోగణపతి । పరహితమతి ॥మంగ॥ మంగళదాయక। మహితగణ నాయక । గంగాధర ప్రియసుతా । సుగుణాన్విత ॥మంగ॥ విఘ్నార్థ కారసావిత! కళితాహిత । విఘ్నాటవీదహన। అఘువాహన ॥మం॥ లంబోదర సుగుణా, డంబాశ్రీహేరంబ । కంబుకంధరసుందర। శ్రితమందార ॥మం॥ అవనిగూడకృష్ణ।కవిపోషణ జగపవనకార్యకారణా। హతసంసరణా ॥మంగ॥

2. సరస్వతీమంగళహారతి। బేహాగ్—రూపక

సరసిజా సనరాణీ ॥జయహారతిజననీ॥ కరుణామయి।వరదాయిని। సరసిజపాణి ॥సర॥ వాణీయలివేణీచకి। తైణాలోచనీ ॥సర॥ ధరకొల్లి పుర భారతీ । వరమందిరని లయే ॥సర॥ ఇలగూడకృష్ణ హృదయ। సలలితగేహే॥సర॥

### 3. వ మంగళహారతి! కల్యాణి! ఆది

మామనోహర। జయమంగళ మోాయన। మాన గుణాకర ॥మా॥ కామజనకను।తాౖమపూజితపద। తామరసయుగళ । కామితఫలదారా। ధామనోహర,ధీర।నానజభీతిహరా మగుణగణధామ ॥మా॥ సంగరహిత భవ। భంగ విహంగతు । రంగమంగళదాయక । సంగీతలోలాగో।పాంగ నాజారయ॥ మంగళహారణభు।జంగళయానా ॥శ్రీమామ॥ సారచరిత్రభవ ।దూరావారాశిగం । ధీరా ! శుభఫలదాయకా ధారాధరాభళ । రీరమహామేరు। ధీరా;నరాదకాం। తాంవైశ్వానర॥మామ॥సరసిజనాభసం। సరణాబ్ధితరణాభూ। భరణాముఖజితతుహిన ।కిరణాపెరవలివురా।వరణాగూడకృష్ణ।పరిణామకారణ ।నిరుపమతోషణ ॥మామ॥

### 4. వ మంగళ హారతి: బేహాగ్? ఆది.

జయజయమామనో।జలజాతబంధర॥జ॥నయవిచారణ కుశే। శయనళలోచన ॥జయ॥ భక్తమానసాబ్జని। వాసావిలా । నక్తంచరసంశవి । నాశారమేశా ॥జ॥ సలలిత కీర్తిజాని।శాలాగోపాలా। నళినసంభవముఖ । నాకౌకసావన ॥జ॥ కరుణాలవాలా! శుభంకర కేవల రూపక।ధరగూఢ కృష్ణకవి। వరవరదాయక ॥జయజయ॥

5. వ మంగళ హారతి! జంఝూటి—ఆట

కస్తూరహారతి। నేర్పుతో మీరుస। మర్పణసే యరె। దర్పజనకునకు ॥క॥ పొంబళ్ళైరముల। సింబు గంగైకొని। పంబుమీఅఁగమన। యంబుజోదరునకు ॥క॥ పురుషోత్తమునకుఁ ।బుణ్యకలితునకు। గరుడగమనునకు। ఘనయశోపేతునకుఁ ॥గ॥ నారాయణభవ। తారణదీనా వన। నారచరితమును। సారెకుఁ బ్రోవుమని ।క॥ సుం దరరూపజిత। సూనశరశతునకు। నందనందనునకు। నవ నీతచోరునకుఁ ॥గ॥ పెరవలిపురవరాం। తరనివాసునకు నిం। దిరారమణునకు భూధరధరునకివుడు ॥కస్తూ॥

6. వ మంగళహారతి' హిందూస్తానితోడి-ఆట

హారతియదుపీం। సారసాయతదళలోచన। సం। సారభయార్తివిమోచన। నారాయణ ఆర్తత్రాణ పరా యణ ॥హార॥ భక్తమనోభీష్టదాయకా। ఘోర। పాతకావ నిజాకుఠారకా । మౌక్తికకలితస । మంజసగ్రైవేయా ॥హార॥ లాలితసుగుణరత్నాకర। సం। పాలిత వారణరా డ్వర । నీలాంబుదాభస । స్నిభసుందరాకారా ॥హార॥ ధరగూడకృష్ణ హృచ్చంద్ర దిర । ధీర । నిరుపమసౌఖ్యసం ధాయకా । పెరవలిపురవరాంతరవాసానువిలాసా॥హార॥

ద్ర । వమ్మ్మ వేరితను । లిమ్మహీ లేరని ॥మం॥ శ్రీకృష్ణ కృపం । జూడు వరుని చెలికాం డవన్ను విడ । నాడవలదు నీ వాంఛనిన్ను మది । వేంచుం బాపములు । వీడనంట ॥గూఢ కృష్ణపోష ॥మంగ॥

౧౧. వ మంగళ హారతి-హిందూస్తానితోడి.—రూపక

యదుకులాబ్ధిసోమనీకు । నిదిగో హారతీ । విదురా క్రూరవరదా శోభ । నదపరాత్పర ॥యదు॥ దేవకీ కిశోర వాసు । దేవశ్రీనిధే । భావజజనకాయ శేష । భాగ్యదాయక ॥యదు॥ పరమపురుషనిత్యమోహన । శిరపరాత్పర। స రసిజాక్షగోవర్ధన । ధరాధరధర ॥యదు॥ పరవలిపురవర నివాసా । విమలమానసా । ధరణిగూఢకృష్ణపోష । ధర్మలాలసా ॥యదు॥

౧౨. రాముల మీంద మంగళహారతి—ఘరజు:—ఆది

కర్పూరహారతిం । గైకొనుమో । రఘువర ॥క॥ సప్తతరాసన । ధ్వంసకరా । రఘువర॥క॥ ఖరదూషణప్రముఖ । ఖాసురభంజన । సరసిజబాంధవకులాభరణ ॥రఘు॥ పితృవాక్యపరిపాలన శీలదా । కలితమనుజాళన హృదయచయ ॥రఘువర కర్పూర॥ ఆంజనేయపరిసేవిత సత్పద । కంజవిభీషణ భయహారణ ॥రఘువరకర్పూ॥ కరుణామృత

కూ । పాపదురితహర । ధరణిసుతవల్లిప్రియ । వరనిలయా
రఘువర ॥కర్పూరహారతి॥

## 11. మంగళహారతి—జంఝూటి—ఆది.

జయజయరఘుకుల । జలనిధిహిమకర ॥జ॥ జయజయ
జానకీజానీ పరాత్పర । జయ॥ దయామయ నీపద । తామర
సములహల్యకయమున నిలిపితి । దశవదన దమన ॥జయ॥
మండితహారకోదండ విఖండన । ఖండనభీమ మా । ర్తాండ
కులభూషణా ॥జయ॥ సతిగారాముసి । సల్పినదారవని । పతిత
పావన నిను । మతినిడి వేడితి ॥జయ॥ ఈడితకీర్తి వి । శాలక్ష్మ
పాకర । గూడకృష్ణసుకవి వేడంబరా కేలరా ॥జయ॥

## 12. మంగళహారతి—జంఝూటి—ఝంప.

ఇనకులాబ్ధిసోమ నీకు । నిదిగో హారతీ । ఘనఘనాభ
సుందరాంగ । కోమలహితమతి । నీరా । జా । క్షా । మునిమనో
విహార రఘువర॥ఇ॥ గాధినందనాధ్వరరక్ష । కదయానిధే । సా
ధుజన మనోబ్జనిలయ । మైథిలీప్రియా । సా । రా । క్షా । రా । నా
ధానాధ రక్షకాహరే ॥ఇన॥ తరుచరేంద్ర సేవితాంఘ్రి
సరసిజా; దయాకర । పరాత్పరా నరాదవరమదాపహా । దే ।
వ॥ దే । వా । నిరుపమాన దివ్యవిగ్రహా ॥ఇన॥ సతతమంజు
భాషణా; శ్రిత జనావనా । వితతనూత్న రత్నఖచిత విమల

భూషణా।దీ।నా।వా।స క్షితినిగూడ కృష్ణపోషణ ॥జ॥

## 13. మం॥ కేదారగౌళి—ఆట.

మంగళ మిదెరఘు పుంగవనే నొసఁగు ॥మం॥ మంగళ కరభవ। భంగపరాత్పర ॥మం॥ జనక జాశ్రితపద వనజద్వయాఖిల।మునిజనవందిత। ఘనఘనాభశరీర ॥మం॥ ఈశను తాపిశి। తాశనరాణ్మద।నాశమహాత్రి భువ। నేశదశరథాత్మజ ॥మం॥ మేరుధరాధర।ధీర దురితహర।నారాదాద్య ఖిల ముని నాథచిత్త గేయ ॥మం॥ ధరగూడ కృష్ణయాఖ్య। వర కవిపోషకా।సరసి జనా భాసుఖ।కర సురపూజిత ॥మంగళ మిదెరఘు పుంగవనేనొసఁగు

## 14. మంగళహారతి—చక్రవాక—ఆది.

మంచిసమయమిదే రారానామనోహరా అనుమట్టు

శ్రీరామచంద్ర।గుణసాంద్ర।హారతిఁగొనుమిదె ।శ్రీ॥ ధీరకలుషవి।దూరశ్రితమం।దారజగదా। ధారరఘువర॥శ్రీ॥ రామముఖ జిత।సోమసుగుణల।లామవిబుధ। స్తోమసన్నుత ॥శ్రీ॥ పూషవంశవి।భూషబుధజన। తోషరిపుగణ।శోషమహాధన ॥శ్రీ॥ కోసలాధిప।గూడ కృష్ణమ।నీషహృదయని।వాస సుఖకర ॥శ్రీ॥

## 15. మంగళహారతి—ద్వారూస్థానితోడి—ఆది

శ్రీరఘువీరా కలుషవిదూరా హారతి నగ సమధీర॥ నారాయణ సంసార విమోచన వారణ రాడ్భయహార ॥శ్రీ॥ భూరిరత్న కేయూరకిరీటసుహారనీరకని భాం । ఘోరాసురకాంతారకతోరకు తాంశూరసుకుమార ॥శ్రీ॥ ధరజార్చితపద సరసిజయుగళా నిరుపమకరుణా లోలా। పరమపురుష పావనచరిత్ర పా। మునతతిహారణ వితరణా ॥శ్రీ॥ కరుణారసం కలిత హృదయ శుభకర పరాత్పరా! సచరాచర పాలకా సురవర పరివలిపుర వాస కృష్ణకవిపోష॥శ్రీరఘువీర॥.

## 16. మంగళహారతి:—కమాచ్:—ఆది.

మంగళమని పాడరే రంగేశునకు జయ ॥మం॥

అంగనలార చెలంగుచుమీరు భుజంగరాజశయనునకు భక్తిని॥ మం॥నీరేజలోచనునకు, బహుపుణ్యకలితకావేరితీరవాసునకు మారకోటిసుకు ॥ వారశరీరుని, కోమలమణీమయాకరనిత్యజయ ॥మం॥ రంగనాయకవిభునకు, ననవరతాయతమాల్యాంగరాగసంయుతునకు మంగళదుండుపా, రంగనుతుండు శుభవ భంగుడునకు శ్రీరంగనిలయునకు ॥మం॥ సామగానలోలునకు నిజదాసార్చితపద తామరసయుగళు

నకు। భామలారయా। భూమిని పెరవలి। ధాముఁడై నమన ।
కామదునకు ॥జయమం॥

## 17. వేంకటేశ్వరు మంగళహారతి—ఆనందభైరవి_ఆది

మంగయానయాలింపుమా అనుమట్టు.

వెలఁదులారహారతులివరే। వేంకటరమణునకు॥ పొలుపుగఁబళ్లెరములహిమవాలుకములరుచు వెలిగించి॥ వెల శ్రీయలవేల్మంగాపతికి। శ్రితజనహితమతికి। హేయోపాధివిహీననిత్యపథయాయికి; శ్రీమతికి॥ వెల॥ లోకాలోకశరణ్యునకు। లోకపావనునకు। శ్రీకల్యాణగుణైకధురీణుం। సాకరుణాత్మునకు॥ వెలదు॥ సకలాపద్వినివారునకు। సంతతసుఖదునకు। సకలంకాత్మకునకు। సర్వేశునకు। అకలుషహృదయునకు॥ వెఈడిత రి విశాలునకు। నినసమతేజునకు। గూఢకృష్ణకవినేనట్టిశ్రీ। వ్యాళగిరీశునకు ॥వెలఁదులా॥

## 18. హిందూస్తానితోడి—ఆది.

వేంకటేశునకు కహారతిఁ। బంకజాస్యలొసంగరే ॥శంకరో రఁగిరి। వంకరునిపవ। పంకజములర్పింపరే ॥కు॥ ధీరుకలుషవి। దూరుశ్రితమం। దారుజగదాధారునిఁ। వీరుతిరుమణి। ధారునియొద్దమీరు। చేరిముదంబునఁ ॥వేం॥ శీలుశుభగుణ।

జాలుపరమదయాళుఁ[illegible]విశాలునిఁ ఖేలుఁగాంచన చేలు
మునిజనపాలు నెదనిడి వేఁడుచుఁ ॥వేం॥ గూడకృష్ణని జాడ
కన్గాను వాఁగవని కొనియాడుచుఁ చేడియలుగుమి కూ
డిపాటలఁ బాడి వేఁడిసభ క్తిగఁ ॥వేం॥

11. మం॥ ఆరభి—ఆది.

కమలామనోహరా కర్పూరహారతి దెగొనుభవహార
॥క॥ కమలసంభవాద్యమరవినుతపద కమల! భీమరిపుహర
ణ అమరేంద్రవినుతమృదుచరణా సుమబాణజనక భూరమ
ణానమదారివంశదమనాతిసుగుణ॥క॥ కరుణారసపం కలిత
హృదయ శుభ చరితమిహిరశత తేజా, వరతాపసకల్ప భూ
జ సరసీరుహాక్ష గోరాజతురగవినుత! కుజనాళినిహాత ॥క॥
జ్ఞానాజ్ఞానవిభేదరహిత! సుజ్ఞానఫలద! గాంభీర్య మాణిక్య
మకుటధర! శౌర్యా భూనిఖిలరూప! గుణధుర్య, నానాప్రమే
య. నతమానివర్య॥క॥ ధారుణీపెరవలి ధామ జనార్దన సార
చరిత' మురవైరి హీరేంద్రశయన! హరి! శౌరీ మారమణీరమ
ణ! కంసారి! దారితసురారి! దాసోపకారి॥ క॥ గురుభవహరశ్రీ
గూడకృష్ణకవి వరద! నిగమసంచారా నరమిత్ర! త్రిజగదా
ధార సురవైరిలోకసంహారా గరుడాంక! నీలమణిహార!
ధీర ॥కమ॥

### 20. వ మంగళహారతి—జంఝూటి:—ఆది

మంగళమని పాడ రే । అంగనలార । రంగనికో నియ్యాడ రే । బంగారుపళ్లెరముల్ । రంగుగఁ బూనియ। సంగజనకమమ్మఁ । గరుణింపుమని ॥మంగ॥ నారాయ ణాచ్యుత । నరహరి కేశవ । సారసదళలోచన । బిరానా యిదే ॥మంగ॥ కంజసంభవాద్యా చిత్త । కంజమత్తరోలం బా । రంజితగుణసముదాయా । అంజలిఁగొనుమనుచు ॥మంగ॥ శంకరనుతభవ । సంకటహరగరు । డాంక!మీా నాంకమోహన । అతులతోషణా ॥మం। శ్రితజనకల్పకక్షి తీరుహా! మందర । క్షితిధర ధర!మురహర । చేకోరాదా రా ॥మంగ॥అవనిగూడకృష్ణాఖ్య । కవివరదాయక । న వమౌక్తికాభరణ । నళతిలోచన ॥మం॥

### 21. భైరవి:—ఆది

మంగళంబునీకు । మామనోహర । మంగళప్రదా!సా । రంగభయవిభంగ ॥మంగ॥ మారాసుందరా । కారాకసకకుధర । ధీరదానవకాం । తారవైశ్వానర ॥మంగ॥ పన్నగేంద్రశయన । భవవిమోచన । ఆ । ప న్నరక్షణామ । హోన్నతగుణగణ ॥మంగ॥ రవికులాబ్ధిసో మ । రమణీయగుణధామ । నవమణివిభూషా । నందూరు

పురవాస ॥మంగ॥ రవిసమాన తేజ । రక్షితబిరాజ । అః
నిగూఢకృష్ణ ॥ కవిమనోనివాస ॥మంగ॥

22. మంగళహారతి—బ్యాంపు:—జుల్వ

హారతిదేమారశుభా । కారమురహార । వారిజా
క్ష । క్షీరనిధివిహారశ్రీధర ॥హా॥ హీరశయన । కూర్మ
వారణ । భూరిసద్గుణా । వారిజాసనాదివినుత । సారచరి
ణ ॥హా॥ రామభీమసం । గ్రామసద్గుణస్తోమ । శ్రీరమా।
కామతారకనామసార్వ । భౌమసర్వసమ॥హా॥ మంగళమ
హీధ్రధరా ॥ నందదాయకా । నందనందనాముకుంద ।
సుందరానన ॥హా॥ ధరణీగూడకృష్ణయాఖ్య । వరకా
కేశవా । పరమపురుషమునిజనసుఖకరధరాధవ॥హా॥

23. మంగళ—మొరవినిబ్రోవవేరలనుమట్టు

జయజయ హారతి।జయశ్రీరమాపతి। రయమునవా
నానుతి । నయముగగొన్నిదే ॥జయ॥ నీలఘనాఘన ।
నిభమృదుకళేబరా । పాలితాఖిలసుర । ప్రచయాపరాక్ర
మ॥జ॥ నిఖిలచరాచర । నిచయస్వరూపక। సుఖదాయకా
సర । సఖ!కలిశశాస్త్రవా ॥జయ॥ ఖగరాజవాహన । క
మనీయభూషణ । నగవైరిపోషణ। నతశ్రీత్రిలోచన ॥జ॥
నిరుపమదుర్భవ।తరణాశ్రితావన। ధరగూడకృష్ణకవి । వ

రదా!లసద్గుణ । జయజయ హారతి॥

24. మంగళహారతి—తోడి—ఆది.

హారతియదుకుల । వీరాసుగభీరా ॥జయ॥ ॥హా॥
మారజనకసుకు , మారఘునాఘనాభశ । రీర!రణశూర,
మహోదాకాకృపాకర ॥జాయ॥ ॥మంగ॥ నందనందన! య
ర । వింవదళలోచన!గో । విందా!సదానందా!వర,బృం
దావనలోలా ॥జయ॥ పారావారాసుతావి । హార! భ
వ । దూరా!మురి । నూరా! నగధీరా! ఘనం । హాగా! న
రవర ॥జయ॥ ధరణీపెరవలిపుర । వరనిలయా! దామో
దర! గూకృష్ణకవి । వరదా! శ్రితఫలదాయక ॥హార॥

25. మంగళహారతి—శంకరాభరణం—రూపక

బాలికామణిరాలను మట్టు.

నీ । రా । జా । లోచనా । నతవారిజాసన ॥మంగళమిది॥
॥నీరా॥ పారావారగ ।భీరవరసుకుమార । మేరు।ధీర ॥నీ॥
క్రూరదానవసం । హారమాధవ । ధీరతత్వవి , చారాభ
క్తమం , దారా । సా రా । కార ॥నీరా॥ సంగరవర,
సా , రగభయహార , రంగావిహాగతు।రంగాగుణనిచ
యోత్తుంగా । మంగ।ళాంగ ॥నీ॥ ధారుణీసృలి । ప్రోద్దా

మపెరపలి । పౌరకృష్ణాఖ్య । పరిదా నిగమసంచారా ।
మారా । శారా ॥నీరా॥

2 ౬వ మంగళహారతి—శ్రీరాగం—అటతాళం.

నీరాజనమునీకు । నీరజనయన । నారవిహీనసం।
సారాబ్ధితరణా ॥నీ॥ ఘోరనరాదసం । హారసుగభీర । నా
రాయణాచ్యుత। నారకద్వారి ॥నీర॥ పరమపురుషభవ ।
పాశవినాశా । ధరగూడకృష్ణస । త్యవిహ్వాన్నివాసా ॥
నీరాజనమునీకు నీరజనయన॥

27 వ మంగళహారతి—శాంతసుఖమను మట్టు.

అనంతపద్మనాభనీకు ।నములహారతి । అనాధనా
ధపోషకావ । యామయాత్మక ॥అనం॥ అనంతభాగ్యదా
యకాభ । వాంధభాస్కర । అనంతసుగుణరత్నాకర।అ
నంతరూపక ॥అనం॥ అశేషభువన మోహనాభి । యాతి
శోషణా । నిశాటకులవిదారణాము । నిప్రపోషణా ॥అన॥
రాజరాజసేవితాంఘ్రిస । రోజమాధవా ॥ రాజీవదళలో
చనసు । ధీజనావన ॥అనం॥ భాసురాంబు దాభదేవా ।
భవభయాపహా । దాసదాసగూడకృష్ణ । దాసపోషణా ।
అనంతపద్మ॥

28. శివునిమంగళహారతి...ఆదితాళం.

హారతీ శివశంకర శ్రీకర మేరుధరాధర ధీరదయా
లో । ఘోరదనుజకాం । తారవైశ్వానర? పారా । వా
రగ । ధీర; పరాత్పర సారచరితభవ । దూరా;సుధీరా
॥హార॥ సామజదనుజవి , రామ; రజతనగ,ధామ; వినిర్జిత,
కామ; జటాకీలిత, సోమ; ఈడితగుణ , స్తోమా; సునా
మా ॥హా॥ శైలసుతామనో , జలజబంభర; శుభ , శీల;
వారణచర్మ చేల; కృపాకర,పాలితాఖిలసుర ।ప్రచయా;
మహేశా ॥హా॥ భాసురబిల్వవనా । వాస;భక్తావనా భ్యా
స; నిస్తులదర।హాస;గూఢకృష్ణయ । దాసమనోబ్జనివాసా
విలాస॥హారతీశివశంకర॥

## కుసుమకులసంజాతలక్ష్మీవిలాసం

## *కోలలపూడి*

29. వది—జంఝూటి—ఆది—కామిరెడ్డియనుజావళిమట్టు

హారతీగిరిజా నాయకా , వరదాయక ॥హార॥ హా
రతిత్రిభువనా । ధారా! కలుషాటవి । కుఠారామ; హా
దారా; ఫణిహారా! । రణశూరా ॥జయ॥ హార॥ భాసుర
తరకై ।లాసకుధరనిలయ; దాసహృన్ని । వాసా; సువి ।

ళాసా; ఘసం । త్రాస; శుభ ॥హా॥ మంగళదాయకా;
సితాంగా; వరవృషభతు । రంగా; భవ । భంగాబ్ధిని ।
షంగా । శివలింగాజయ్య॥హా॥ ధరగూడకృష్ణకవి।వరదా।
శ్రితఫలదాయక। పరమశుభా ।కర, మారసం । హార
మామనోహరపూజిత । హారతీగిరిజానాయకా

30. అంకాపరమేశ్వరీ మంగళహారతి—తోడి—ఆది

అంకాపరదేవీ । నింకెఱంగన్కర్పూరహారతిఁ । గొనుమో ।
యంకాళదేవీమహేశ్వరీ । శంకతొరఁగియక ।లంకమతి
నొసఁగెద ॥నంకా॥ శ్రితవాంఛితార్థప్రదాయినీ । రోగ ।
క్షితిరుహ ఘోరకుఠారిణీ। తతనవమణిమయతారహారధా
రిణి ॥యంకా॥ భక్తమనోగేహవాసినీ; । యాది । శక్తి;
మూర్తిత్రయరూపిణీ; । ముక్తిదాయినీ; వర । మౌక్తిక
ధారిణీ ॥అంకా॥ధరశ్రుత ధరాధరవాసినీ । ఘోర । తర
భవపాశనిర్మూలినీ । పరమంత్రపరతంత్ర , పరయంత్రశ
మనీ ॥అంకా॥ వర పైరవలి సత్పురావనీ । జననీ । నిరుప
మానందసంధాయినీ । ధరకూడకృష్ణస । త్కవిహృన్ని
వాసినీ ॥అంకాపరదేవీ॥

31 వది దేవీమంగళహారతి—ముల్తాని—జాల్వ.

సరోజశరుని బాణకినే మట్టు:

కర్పూరహారతిదిగోమహా । కాళీభవానీ , దర్ప

దమనురాణిని న్నె । తలఁతుభాషనీ ॥కర్పూ॥ మహాళమం దగమనీకనుజ । మదషినాశనీ । పరాకు సేయనేలగిరి । వం శపావనీ ॥కర్పూ॥ అశేషభువనమోహినీమ । హావిరాగి ణీ । సశూలఖడ్గబాణతూణ । సలలితపాణి ॥కర్పూ॥ చకి తమృగవిలోచనీపా । తకవినాశనీ । అకార్యకార్యకారణీ, మహావిలాసినీ ॥కర్పూ॥ దాసచిత్తకేకినీకా । దంబినీమ ణీ ॥ భాసుర పెరవలిపురని । వాసజననీ ॥కర్పూ॥ మునిమ నోవిహారిణీ । సన్మోదకారిణీ । తనరుగూడకృష్ణయన ।త్క విదానసీ ॥కర్పూరహారతిదిగో మహాకాళీ॥

32 న బారువ—ఆది—మంగళకిరవన అనుమట్టు.

జయజయహారతీ। శంభురాణీభవ । భయవినాశనీ। పరి । పంధిచయభంజనీ ॥జయ॥ మకర్పితసుమహిత ।మం జులహారతి । సదయతఁగొనుమో । త్రిదశేశ్వరీజయ ॥ జయ ॥ భండనరాశన । భంజనీ; భైరవి । భండి కాంబికాహిమ । శ్మాధరకుమారీ ॥జయ॥ భూరివివేకినీ పురుషార్థదాయినీ । కైరవలోచనీ । గౌరీ;శాతోదరీ ॥జ॥ హ్రింకారీక్లీంకారీ । త్రిపురాసురసూదనీ । శంకరీ;హరి సోదరీ। సాధ్వీ;మృడానీ ॥జయ॥ వరసురాసురగణ । వంద నీ;శూలినీ ధరగూడకృష్ణయాఖ్య । వరకవిపోషణీ ॥జయ జయహారతీ॥

## 33 వ మంగళహారతి—జుల్వా.

హిమగిరీంద్రతనయనీకు । నిదిగో మంగళహారతి॥ భ్రమరవేణీ । భవుని । రాణీ, పరమపతితపావనీ ।హి॥ శాంతశమద మాదిసుగుణ। సంపత్ఫలదాయినీ, దంతి, గమనీ, దనుజ । దమనీ । సంతతసుఖదాయినీ ॥హి॥ రాజరాజ శేఖరీయ । వ్యాజకృపారసలహరీ । రాజ, రాజా । ర్చితపాదానీ, రేజా;భాగ్యదాయినీ ॥హిమ॥ పూర్ణిమామృతాంశువదనా; పుండరీకలోచనా;అ । పర్ణా । వర్ణా । శ్రీమ । ధర్మ । వర్ధనీ । సతీమణీ హిమ॥అంచితమణిమయ కిరీట । హాటకకటకధారిణీ । వాంఛిత। తార్థప్రదాయినీ । భవపాశనిర్మూలినీ ॥హిమ॥ శివమనోవిహారిణీయ । శేషభువనమోహినీ । అవని।గూఢ।కృష్ణహృద। యాబ్జగేహవాసినీ హిమగిరీంద్రతనయ।

## 34 వ మంగళహారతి—ఆనందభైరవి—జుల్వా.

జనకరాట్తనూజమంగళం । త్రైలోక్యనమిత, ఘనపదారవింద మంగళం । దనుజరాడ్వినాశకారిణీ, యనుపమసుఖసంప్రదాయినీ । ఘనఘనాఘనాభవేశి । వనచునా । మనమునవిడి।మునిశమునినుం । గొనియాడెవ ॥జన॥ అంబుజారిసన్నిభాననా । మరాళగమనా । అం

బుజాప్తవంశపావనా । అంబుజాయతలోచనీ। యాడంబరీహే । మాంబరీసత । తంబురునినువేఁడెదనామ । నంబునమో । నంబునని । త్యంబనురాగంబునసంబ ॥జన॥ భూరిమణిమయ తారహారిణి । సర్వాంసహాకి । శౌరిహృపి,భాగ్యదాయినీ । నారదాదిమానినుతప । దారవిందా । పరమానందా । క్రూరదనుజవంశనాశనీ । సారసముఖ । సంస్మృతిసం । తారకమంత్రోచ్చారిణి ॥జన॥ వరపినపాద్వారనివాసినీ। దాశరథిరాణి । నిరతిశయగుణ ప్రచారిణీ । గురుకటాక్షవీక్షణీభా । సురవచోవిలాసినీ । ధరణిగూడకృష్ణపోషణీ । నిరుపమభవ । శరధితరణీ; తరుణిరోళొనుమిదె ॥ జనకరాట్తనూజమ॥

## తెలుపుదగ్గర పాటలు.

### 1. హిందూస్తానితోడి—ఆది.

తలుపుఁదీయవెభామినీ। దయఁదలఁచిబ్రోవవేమానినీ । నిలచినినుకడుఁ । బిలువనాతోఁ । బలుకవేమడికోపమే । యలరువిల్తుఁడు । ములుకులనున । న్నలయఁజేయఁగఁ దాళనే॥త॥తలుపుఁదీపనులేలరాననుఁ। బలుకరించుటచాలురా । చెలువుఁడానినుఁ । గలయువారలు । తలఁపఁగనునిటలేరురా । తులువనామది । కలఁగఁజేయక।

తొలఁగిమొట కేనేగరా ॥తలు॥ కాముబారికి నోర్వనేనీ। ప్రేమఁజూపక తాళనే। భామయెటకో యేగుమనసే। నేమి నేరమెఱుంగనే ॥తలు॥ నేరమేమియు లేదు రానగా। గోరు చేమరియూపరా। కోరికలు కడ తేరఁగానా। నారీమణిరతిఁ గూడరా ॥తలు॥ మాయు రేయుదినేరమానీ। కాయువిదకువి రోధమా। న్యాయమాయిటులాడనీకిది। హేయమేసు మకోమలీ ॥తలు॥ ఘోరమాయకాఁడవురబల। జారచోరశి ఖామణి। ధీరసగుణ విహారతల్లిఁక। పోరబుధ చింతామ ణి ॥తలు॥ మా యకాఁడనౌచునినునే। మాయఁజేసితినే చె లీ। కాయజునిజడికోర్వననుచ। న్యాయముఁగమది నెంచకే॥ తలు॥ ఎన్నియుపముల నేర్చితివినీ। వన్నెబాసలకోర్చితి। వెన్నటికినిను నమ్మరాదుర। వన్నెకాఁడ మురాంతక ॥తలు కొమ్మరోనను నమ్మరాదని। యెమ్మెలాడఁగనేలనే। సొమ్ము సిల్లితిఁ గీరపిక బృం। దమ్ముపలిపెడు రొదలకె ॥తలు॥ మా టిమాటికిఁ బిలచెదవునీ। పాటిసరసులఁగానరా। సాటివా రలు నవ్వనగుము। మ్మాటికిని వేఁదర్లరా ॥తలు॥ ధరణిగూ డకృష్ణయాఖ్యుని। వరదుఁడనేవినుకామినీ। కరుణఁజూడు ము ప్రేమమెయినను। సరసిజాయతలోచనీ ॥తలు॥ భూ మిలో శ్రీకృష్ణయాఖ్యుని। స్వామివైనను శ్రీధర। నీమనంబు నఁగోపమెంచకఁ। గాము కేళినిఁగూడరా। తలుపుఁదీసి తిమాథవానా। వలపుఁదీర్చుముభూధవా। యలరుశ

య్యాపైనిఁజేరుక । కలసిమెలసిరతిశ్రీమగ । అలయుచును
నిరుపురముమూరుని । కలనగెల్చెడిరీతిగా॥ తలు॥

## 2. భైరవి—ఆది.

తలుపుఁదీయుమా । తరళాక్షివయఁదలఁచి ॥త॥
నిలువఁజాలనీదు । నెమ్మోముఁజూడక ॥త॥ చాలుపో
రగో । పాలచూడామణి । ఈలీలననుగేలి ॥ యేలసేతు
వింకఁ ॥జాలు॥ సమదవారణ । గమనానన్నుఁబ్రోవ , స
మయమిల్లిపుడే । కోమరారెనేఁదాళ ॥త॥ మంచిదిరనీ ।
వంచన మానర । కాంచనచేలనీ । కొంచెపుందనము
॥చాలు॥ ఇంచువింటిమేటి । పొంచిపొంచివిల్లు । వంచి
గురిగానేసె । మించుఁబోణితాళ ॥త॥ చెఱకు వింటివ ।
జీరు కాకలకు । వెఱచితేనిదాని । మఱుఁగుఁజేరఁబొమ్ము
॥చాలు॥ చక్కెరైణాక్షియిట్టి । వికలాలాపముల । నకటా
నన్నునాడ । నకముకాదెపోరిడ ॥త॥ జారచోరులను। జే
రనియకము । మేరుధీరమమ్ముఁ । జేరునేయీమాట ॥చా॥
బోఁటీమెంతటి । మాటఁబల్కితివె । హాటకాంగినీన ।
య్యాటఁ గోరుదన్ను ॥త॥ వన్నెకాఁడనీ । వన్నెమాట
కలలోఁ । గన్నమూటనాలో । నిన్నిమాటలేల॥చాలు॥
అవనిగూపకృష్ణ । కవినిఁబ్రోచినమా । ధవునియానవి
నుమో । యువిదాతాళఁజాల ॥త॥ తలుపుఁదీసితికం ।

దర్పసుందరాంగా । యిలను గూడకృష్ణు । నేలుహారి వీన యిన ॥తెలుపు॥

### 3. హిందూస్తానితోడి—ఆది.

కమలాయతలోచనీ । గంధగజగామినీ । భ్రమఁ గొని వచ్చితి । వాకిలిఁ దియ్యవే ॥క॥ కమలదళలోచన। కరిరాడ్భయమోచన । భ్రమఁగొన నేటికి। వాకిలిఁదియ్య ను ॥క॥ అళికచ యీమాటలు । బలుకఁగ నేటికే! య లరువిల్తుబారికి ।హా। మనఁజాలనే ॥క॥ మనఁజాలననిక దు । మనికితమందెదవు । ఫణిరాజశయననీ । భావమే మోతోఁచదు ॥క॥ భామనీవెఱుఁగని । భావమేమున్న దే । ప్రేమించియిఁకననుఁ । గాముకేళిఁ దేల్చుము ॥క॥ కాముకేళిలోనినుఁ । గలసి సుఖంచిన । కామినీ సౌధ ము । కాదిది పోపొమ్మఁక ॥క॥ పోపొమ్మనుచుననుఁ గోపగించకేసతి । ఏపడఁతినిరతి , నేలితినినువిన ॥క॥ ఈ వేపడంతులు । నేలిన నాకేమిర । భావజజనకనే । వాకిలిఁ దియ్యనురా ॥క॥ తెరవానీమదిమంచి , తెరఁగుయోచిం చుమా । ధరగూడకృష్ణకవి । వరదుఁడ శ్రీకృష్ణుఁడ ॥క॥ ఘనఘనాభసుందరా । కారనేవాకిలి । ననువ్రుగఁ దీసితి, ననురతినేలుము ॥క॥ కమలాయతలోచన । గజరాజపో

షణ । మమతఁ దల్పఁదీసితి । మదిఁగిన్క బూనకుము ॥కమలా॥

#### 4. జంఝూటి—ఆది.

కలవాణి ననునయ, తలఁచితల్పఁదీయుమా, యలరువిల్తుబారికి । నిలమనఁజాలనే ॥కల॥ అలుక యేల నేచెలి, పిలచినఁ బలుకవు । వలపునీపై నిడి, లలినరు దెంచితి ॥కల॥ ఇంతతులువతనమా, ఇంతటిసాహనమా, వింతగానీనిశి । వేళనఁబిలువఁగ ॥విం॥ పంతమూనినన్ని టు, బలుతూలనాడఁగా, నింతసాహసివినీ, వెవరోమ దిఁదోఁచదు ॥ఇం॥ బాలికామణిరొగో । పాలుఁడఁగాన చే । ఏలనన్నెఱుఁగని । లీలనటించెదు ॥కల॥ ఆలమం దయెవ్వని । పాలొనరించిగో । పాలమాళియిటు, పరు విడిపచ్చితి ॥వింత॥ పంచశరుఁడువిలు, వంచికఱుకుట మ్ముల । నించెనేఁదాళనే । చంచరీకాలకా ॥కల॥ అ ద్రిరాజాణనీ । సుద్దులుమానరా, ముద్దచాలనౌనను । ను ద్దవిడిఁగలఁచెద ॥వింత॥ అన్నులమిన్ననే । నిన్నెమికలఁ చితి । చెన్నారననుఁగౌఁగిఁట । జేర్చిముద్దియ్యవే ॥కల॥ ఇన్నాళ్లనుండిమతే, కన్నియనేలితో । వన్నెకాఁడాయే గుమా, కన్నెకవుంగిఁటికి ॥ఇం॥ కూడకృష్ణాఖ్యుఁడు ।

వేఁడనాతనిపయిఁ । జూచినేనేగిన । జాడనీవెఱుఁగవే॥క॥
మఱచితినీవేగిన । తెలుఁగునేనాడిపప । ల్లవుఘులనీమది ।
నుఱకనన్నెలుమా । రారాక్రియదుకుల । వీరాక్ర్యపాకర।
రారననుఁగొఁగిటఁ। జేరిచిరతినేలఁగ ॥రారాక్రి॥

౫. మంచిసమయముదెరార నామనోహర-అనుమట్టు

వారిజపాణి । కిలవాణి। వాకిలిఁదియ్యవేవా॥ కోరి
నీవరిచేరిననుఁగనుఁ । జేరిననుపలుకాడవేమది ॥వా॥ పో
రాముఁరహోర । యిదియేరా । వాకిలిఁ దియ్యను ॥పోర॥
ఏరయిటుమితిమీఱినాకడఁ । జేరిపలుచనసేయనేటికి। పో
అసమశరుఁడుకడు । కసిమసంగిననుఁ గసరిసుమశరము॥
।తే।యా। బిసరుహాక్షి । యసదునిల్వఁజాలను । లేని । పో
ని । కోప । మేల । చేసెదు ॥వారి॥ ఒరుల మరిగి మెఱ
యు దొరవు ననునిపు । డరసిసరసములనా ।డా। పరమ
మోద । కరము; పరమపురుషవి । శేష । భాష । లేల ।
తూలనాడక ।పోర॥ కలికి; మదను । ములికి: కనలిననుని
టుఁ । క్రలఁచఁదలఁచుటిదియే । లా । వలచియెఱుఁగ । వె
లఁదిరొకుల నినువిన । వలదు । వలదు ॥ వలపు । ని
లుపు । సేయఁగ ॥వారి॥ వలపువలననిను । నిలుపఁగ
లుగునతి । వలుమనపురమున । లే । రా । భళిరయింత।
వాఁడవనుచుఁదెలియక । కలసి । యింత । వలచిమోస

పోతిని ॥పోర॥ ఏమిమోస మొనరించినాఁడసుమ । కోమ
లినిన్నెప్పుడైన । కాముబారి । కోర్వఁజాలనాయెడ । నే
మి। నేర, మున్న । సైచవలెనిఁక ॥వారి॥ చాలుచాలునీ ।
సంగతి తెలసెను । నీలనీరదని ।భాం । గా। ఏలలేనిపోని
యాసపడియిటు। కా॥ మేల।తూల,నీకనిలచెదు ॥పోరా॥
తరుణి! మంచితరుణమునాయెడఁగని । కరముకరముకొ
మ। రా। రా । సరసి । వింత । వింతరతులనేలుము, ధర
ణి । గూడ। కృష్ణ।యాఖ్యపోషుఁడ ॥వారి॥ వెన్నుఁడ వ
నినిను । నన్నువఁదెలియక । నన్న చేసితినిచా । లా ।
చిన్నదాన । గూడకృష్ణపోషక । అన్నిమరచి । నన్ను
రతులనేలుము । రారా । యదువీరా । సుకుమారా । భ
వభయవిదూర ॥ఇటురారి॥

## 6. హిందూస్తానితోడి—రూపక.

నిలువఁజాల । జాలమేల । తలఁపుఁదీయవే , కలి
కిమిన్నవాపైనీకి । యలుకయేలనే ॥ని॥ అలిగితిననియూ
రడింపఁ । దలఁచియిట్టులఁ , బాలుపుమీఱనర్థగాత్రి ।
మునసువచ్చితే ॥అలి॥ అలరువిల్తుబారికేను । కలఁగి ని
న్ను నేఁ । గలయవచ్చినాఁడలాఁలి । కాదెమానినీ ॥ని
లు॥ వెన్నుఁడనినుఁ । గలయఁదగిన । కన్నెలింతుల , ను
న్నవారటంచుభ్రాంతి । నొందితేలొకో ॥అలి॥ జలదవే

ణేనన్నునింత । చౌకచేయకే । అలఁతిమాటలాడియిట్లు । రలఁగఁజేయకే ॥ని॥ ఉరలఁజేయనాకేమియవ । సరముక ్లైరా । మురళీగానలోలా! లేచి । పోరా వైళమే ॥అలి॥ పెరవలిపురి । వరనివాసుఁడఁ । దయణీనన్నిఁక । మరుని కేళిఁదేల్చిమదినిఁ, కరుణఁజూడవె ॥ని॥ మామనోహరుఁ డనటంచు । మదినిఁదెలియక । నామునఁజూపితిదానిమరచి పే్ మనేలరా॥

## 7. రాడే మాయకాఁడే-అను మెట్టు.

భామా; తలఁపుదీయుమా । లేమా నాపయినింత । కోపమా । నాదు ; మోమునఁజూడఁగనీకుఁబాపమా కామించిపిలచినఁ । గానిమాటాడవు ॥భామా॥ పోరా । యదువీరా । ఈరీతినర్ధరాత్రంబున । నన్నుఁ , జేరనేటికి నంజనంజన , ధారుణీనినుఁబోలు,ధీరులకిదితగవే,పోరా। తగవుకానిమదలించకే । నాతోఁ , దగుమాటలాడి లాలించవే , మృగశాబకాక్షినా । దగుకోర్కెఁదీర్చవే ॥భామ॥ నీకోర్కెఁదీర్పఁగలారమే । యిందు, మై , కోలుఁజెందనసింగారమే , రాకేందువదనయా । రాధికామణి కడకు ॥పోర॥ అధికప్రసంగము । లేలనేనన్ను । నల్లరిపాలేయఁజెల్లునే । మధులిహాలకా! రాధ । మాటనీకెందుకే ॥భా॥ ఎవరిమాటలతోనాకేమిరా । నీవే । జవరాండ్రఁ

గూడిన నేమిరా । నవనీత చోరనీ । వశ నీతుఁడవు లేచి॥పో
ర॥ చేడెనన్నిటురవ్వ సేయ కే । మంకు । వీడినీకొఁగిఁటఁ
జేర్చవే । గూడకృష్ణాఖ్యుని । యేలువాఁడ నేసత్య॥భా
మా॥ తెలిసి తెలియకను నేనాడిన । మాట ॥ లెడఁదనుం
చకను నే స్తంబున । జలజాతనయనక । గలసిసుఖించు
ము ॥రారాసుకుమారా॥

8. రాపుచేసెన వేల రాజగోపాల-అనుమట్టు.

ఇందువదన। సౌందర్యసదన॥ఇం॥నందనందనుఁడనా
యందునయకనవె ॥ఇం॥ ఓరాజారా, చోరాగ్రేసరా
।ఓ॥ నీరాపు, తెలసెను। పోరాయఘుదూరా ॥ఓ॥ కో
మలీ! నే, నేమిచేసితి నే।కాముని కేళిలోఁ।గలయవచ్చినన
న్నుఁ, బ్రేమించకిటుమూరు। మోముపెట్టెదవు ॥ఇం॥
ఈపగిదినీ। వననేలపూని । నాపాటివారలిం, కేపట్ల లేర
ని । గోపాలమౌళి: యిటు । గోముఁజూపకురా ॥ఓ॥ కల
భగమన । జలజాతనయన । చిలుకలుగుమికూడి, కలకల
ములనన్నుఁ । బలుకరించఁగసాగె, నిలువఁగలానా ॥ఇం॥
కరుణాభరణా, ఖగరాజగమన, కరమునాతో నిట్లు । వి
రసోక్తులాడెదవు । పరువు కాదింటికి । పదరా నెరజాణా
॥ఓ॥ జలదవేణి । జలజాతపాణి । ఇలగూడకృష్ణాఖ్యు । నే
లుకృష్ణుఁడనన్నుఁ । బలుచన సేయకేఁ । గలయుమీ వేళ।

॥ఇం॥ ధారాబాల । రాజగోపాల ॥ శూరిమిమీరన౯ । గా
రవించుముమరు । బారికిసేఁదాళ । వార్ధిగంభీరా ॥రా॥

## బువ్వము బంతి పాటలు.

### 1. బేహాగ్—అట.

తరుణీ! శ్రీహరిబువ్వమునఁగన । నిరుపమానము
తోఁచెఁగా । హరికిఁగాక్రైవెభవంబులు । పెఅలకౌనెనిజం
బుగా ॥త॥ పచ్చలపందిళ్లఁగదళీ । పాదపములనునాటిరి ।
మెచ్చుగుల్కువిచిత్రపటముల । నచ్చటచ్చటవ్రాసిరి॥త॥
కళలఁదేరెడిదీపములకనుఁ । గవఁజూడఁగఁజూడఁగా। న
ళినమిత్రసహస్రసత్కాంతులనుగేకునిజంబుగా॥త॥ హ
ల్లకల్లోలములఁజేసెడి । యెల్లవారలఁజూడుమా । ఫుల్లజ
లజదళాక్షి! వజ్రుల । నెల్లసొగసాకట్టించుమా ॥తరు॥ సర
ససల్లాపములనాడుచుఁ । దరుణీమణులుముదంబుగా । పర
సిపేర్పేర్వరుసలనుదోం । డొరులుపరిహాసింపఁగా ॥తరు॥ప
ప్పులునువరి । వంటకంబులు । గొప్పదోసెలుపూర్ణముల్
అప్పడాల్వడియంబులునుబల్ । మెప్పుకొల్పెడిశాకముల్
॥తరు॥ పెరుగు; సద్యోఘృతముచూడఁగఁ । గరమునూరి
నకాయలు౯ । చెలువ! యాదెసఁజూడుమదె । సుందరు
లుపిలిచెడిరీతులు౯ ॥తరు॥అహాహాయీబువ్వమునుఁజూడఁ

గ । నివహాపరంబులజూడగా । మిహిరకులతిలకునకు,శీతా। మహిళకనుమోదంబుగా ॥తరుణి॥ ధరణిశ్రీపెరవలి పురనం । భరితుండై విను కామినీ, యరసిగూడకృష్ణాఖ్యుం బోషించెడిహారిని గనని దె వేళని ॥తరుణి॥

## 2. బువ్వముబంతి పాట.

నరహరిబువ్వముతినరారు । ధరమును నెట లేదీతురు ॥న। నవమాణిక్యకాదుల । నవిరళముగనిడి । రవనికలుకలపం । దిటిలోన ॥న॥ మిహిరోపలంబులే । బహుదీపపజ్ఞులౌ । నహహామనమలరునవిచూడ ॥న॥ చిత్తారుపటములు । మొత్తములనుగనం జిత్తము ప్రేమాస్పదమునుం జెందు ॥న॥ రంభోర్వీజంబుల । జృంభణముగనల । గంభీరంపుపందిటనుంచిరి ॥న॥ నెచ్చెలులతోంగడు । ముచ్చటలాడెదు । నచ్చెలులంజూడంజోద్యమౌను ॥న॥ తరళాతులందఱు । సరసనల్లాపముల్ । పరితోషమున నాడుచుండ ॥నర॥ మందేభయానలందందంపందందిరుగుచు॥ నందిరివడ్డనసేయుముందు ॥న॥ సారరసాన్నముల్ । భూరినుశాకముల్ । కోరినపిండివంటలిరుపొంద ॥న॥ ధర వెలయుంబెరవలి । ధామునంశ్రీహరి । కరుణమనలంబోషించుచుండ ॥నరహరి॥

౨. పాట. నిన్నెకోరినాను అందముగా అనుమట్టు.

ఇంతిరో। హరిబూ , బంతిరమ్యమది। యేమని
తెల్పుదు । వింతవింత । లుగఁదోఁచెడినీ । ఘనవైభ
వములు ॥వి౦॥ రంభోర్వీజముల , రాణతనరు పందిటిలో
నుంచిరి । అంభోజాక్షి! మణులే, ఘనదీ। పములుగానుం
చిరి ॥ఇం॥ తెల్లములనురం । జిల్లఁజేయు చిత్రరువుపటం
బులు । నెల్లెడలహరిని । పమెయం । చునుబోధించెదు
॥విం॥ నారీమణులు । నవమణీమయ సుకలాపములనునిడి
మేర । మీరఁ। గనుహారాయలుగని । చ్చటికరుదెంతురు
॥ఇం॥ సరసోక్తుల । సతులొక్కరొ నొక్కరు పరిహసింతు
రు , సరసిజా । క్షుని రుక్మిణినొక । పీఠముపైనిడిరింతి ॥
మో । ద । మా । రఁగ । ముగిదలుపాటలఁ గ్రొత్తవిపా
డుచు । భేదా । భేద । ములులే । కనుసర । సంబులనా
డెద॥రిం॥ అంచితంబగుశా । ల్యాన్నతకరిఘృతసూపశాక
ములు , మంచియు । క్కలఫల।ములనెల , మినివడ్డిం
చెద ॥రిం॥ కైర ॥ వా । క్షీరాశిరిశాం । తుఁదురుక్మిణితో
డనుబువ్వము । నార । గించఁగనుచూ । చెడివా । రలదే
భాగ్యము ॥ఇం॥ గూ । డ , కృష్ణాఖ్యు । జాడఁగనుంగొ
నిపోరిచెడిశిరిహరి ॥ వేఁడినట్టు। లుగసద్వరములనొసఁగె
డునిత్యశ్రీ ॥వింతి॥

4. పది శాంతసుఖనిరంతరం అనుమట్లు.

ఇంతి! యీబువ్వము । బంతిసేయగ , మెంతచో
ద్యమె । స్వాంతిమునక । త్వంతలీల। వింతమీాతెనే ॥ఇం॥
కంటికింపగున । నంటులమొక । లంటనాటిరి । కంటివా
వాల్గంటి. భోజన । మంటపాన్నతిఁ ॥ఇం॥ పోలఁగ్రొ
న్నెల । తాలఁదనరుకు । డ్యాలపై తగఁ జాళువామేల్ బొ
మ్మలవేన । వేలువ్రాసిరి ॥ఇం॥ మేలుగుల్కుము । త్యాఁ
లబలుతోరణలు । తరణితో , మేల। మాడునన్మణిదీ ।
పాలుచూడఁగఁ ॥ఇం॥ వన్నెమీారిన।సన్నబియ్యఁపు। ట
న్నమాత్రలో । నెన్నఁదరముకాని కూరలెన్నొ చేసిరి ॥ఇం
అప్పడాల్వడియాలునుక్కెఱల్ । గొప్పదోసెలుఁ మెప్పు
గల్గుగోఘృతంబు । దొప్పలాదిగఁ ॥ఇం॥ అవనిగూడక్ష
ష్టాఖ్యనేలుమా ।ధవుఁడు నేఁడిటఁ ప్రవిమలాంతరంగు
డగుచు । వరములివ్వఁగఁ ॥ఇంతి॥

5. పది ఆనందభైరవి—ఆది.

మందయాన యాలింపుమా అనుమట్లు.

జవ్వనియీా ॥ బువ్వముఁగనఁగా । నెవ్వరికినీఁద
రమె । ఇవ్వసుధలోఁ । గవ్వపుములఁదాల్చిన । కమలా
తునకుగాక ॥జ॥ ఘనతరమౌక్తికతోరణముల్ మణిమ

యదీపములు । గణుతింపఁగఁగా , మినుల శ్రేణులును। ఫణి
పతికినిఁదరమె ॥జ॥ రంభాపత్రములెల్లవి । జృంభణముగఁ
బరచి । రంభోజాక్షిరో । గుంభనముగ శాత । కుంభ
మంటపమున ॥జవ్వ॥ వరశాల్యాన్న సుసూపముల్ । ధరఁ
గల శాకములు। పెరుగుఘృతము। లరయఁగ భక్ష్యంబుల ।
గురు తెలుఁగఁగఁదరమె ॥జ॥ తరుణులెల్లఁదమపంతముల।
సరసంబుగఁ బాటలఁ బాడ । నరిదియయ్యెయా । తెలుఁగుఁ
గనుంగొన ॥ సరసిజాస్యవినవె ॥జవ్వ॥ ఎంతని యేవివరిం
చెద । వింతలన్ని కాంత । స్వాంతమలరుబూ । బంతిఁగ
నుంగొన । నెంతవారికైన ॥జవ్వ॥ ధరణిగూడకృష్ణాఖ్యు
ని , వరదుండగుశౌరి । తరళాక్షిరో! యీ । సరణిఁజూ
డఁదా , నరుదెంచునుకోరీ ॥జవ్వనియీబువ్వముఁగనగాఁ
నెవ్వరికి॥

## న రు స పా ట లు.

### 1. బారువ—ఆది—మంగళకరవన అనుమట్టు.

నగలాడివదినెనీ । మొగతాళిమానవే । మగువాని
న్నెఱుఁగని । ముగిదెలెవ్వారెయిట ।వ॥ తగుదునసుచు
నగు । మొగముజిగిమించఁగ । మొగవారి మోలనీ । టు
గఁగుల్కసేటికే ॥వగ॥ చక్కనిసతినే నొక్కతెనేయని

టక్కులాడినీమదిఁ, డెక్కులుమానవే ॥వ॥ బోఁటిరో!
స్నుఁగను। గీటెడవేలయుల ।నాఁటినీసంగతి । పాటకమా
నవే ॥వ। మించుఁబోఁణిరో! కడు కొంచెపుఁబనులకు, వం
చనమానియిటు । నంచరించనేటికే। వ॥ ధరణిఁబెరవలి
పుర । ధాము మల్లేశ్వరు । చరణార్చనలమదిఁ నెఱుఁగ
కఁ జెఱలాడెడి ॥వదినె॥

## 2 వది వనమెంతో ఘనంబయ్యె అనుమెట్టు.

వదినెనీవిటుసేయఁ । బరువవునె తెల్పుమా ॥వది॥
ఔరరింత లేకపోయె । మదినీకుఁజెడినదాయె । ముదితసం
తసమాయె । నవరకఁదర్లమా ॥వది॥ మానినీ! నీవను ।
మానము నెంచక । కానిపనులు చేయ । ఘనమానెతలపో
యజాణ । వీటిని బాయ । సానమేడఁబోయె ।వది॥ నెరసి
నకురులకు । మెఱుఁగరంగులఁబూయ । తరుణిరో చిఱుత
వే । మఱియానగానవే। ధరనెంతగుణవతివె। సరసములె
ఱుఁగవే ॥వది॥ ధరగూడకృష్ణాఖ్యుని । వరదుఁడౌశ్రీహరి
గరితరో! నినుఁజేరి । కరుణింపడాయెకోరి । దురితగుణము
వీడి । దిరుగువగలాడి ॥వదిననీవిటుసేయపరువవునె॥

## 3. వది జంఝూటి—ఆది.

వదినెరో నాయెదుట । నదరెనవది యేలనే ॥వది॥

విదితమయ్యెనీవల ॥ ముదుసలితో పవ్వట ।పది॥ జెనరక
నము రేయిని । సదనము వెలువడి । మదిలేనివానితోడ ।
ముదిత!కలయ లేదఁటే ॥వ॥ అంగన! సునాతిని బంగరుసొ
మ్ము-త్రుల । తొంగలించుచునపుగవా । వెంగలి తెలవా ॥వ॥
ఇంతిరో నీవెంతటి హోంత కారి వెగుణ । వంతులఁగూ
ఏ నెంచవు । ఒడలెఱుఁగవు ॥పది॥ ధరగూడకృష్ణాఖ్యుని
వరదుకాశీంహరి । గరితరో. నినునన్నించునా। కరుణిం
చునా ॥పదినెరో.

4. పది జోబన భేటేజావ్ బదిలావ్ బేగియావురే

నాతినీవిటు । మూతిదిప్పక । నీతిగాన వే । నాతి
రో నీతిగానవే । నాతివాగుడుబోతుతనమునీ । లాఁతివా
రితో జగడమిా । రీతిసేయుట । ఖ్యాతిగాదిక । నాతురము
న ॥ రోతతనమున ॥నీతి॥ మొన్న రేయిచే । సన్నలనుర ।
మ్మన్నపాఱునిఁజేరెనీ । వన్నిచేయఁగఁ । గన్న వారికి । తి
న్నఁగమఱియాడజరుప ॥నీతి॥ టక్కరితనమున । నొక్కవి
టుఁడునిను । మక్కువతోఁబక్కరించఁగా । సక్కఱకల
దేని । రొక్కమిచ్చినీదు । మక్కువతీర్చక । మరలిపొమ్మ
నలేదా ॥నీతి॥ పలువురిలోపలఁ । బలుగాకితనమునఁదూలు
వమాటలాడకే చెలియలందఱునిన్నుఁ। బలుచన సేతురు
కలికినోరునుమూసి । తొలఁగిపొమ్మిత్రటకాసి ॥నీతి॥ కరుణ

తోనేఁ దెల్పు । తెరఁగులఁ పిలిచిననీ । దురితగుణములఁడంచి యీ । ధరణిఁగూడకృష్ణ । వరదుఁడై మురవైరి । గరిత రో! నిన్నుఁక । పరగునఁబ్రోచునే ॥నీతిగానవే॥

5. వటపాట, నారపాట—రారాపోదాము. అనుమెట్టు.

ఔనౌనేసంగనాచి । నీనడతలింకదాచి । మాన వతివౌదువేయీ । మానెనవారిలోవేచి ।ఔ॥ అద్దిరా చీఁకటితప్పు । నందులోఁగొందువే మెప్పు । ముద్దరాలానీ కేచెయ్యు । పొల్పుకాదిస్సిరో ॥మెన్నాడౌనా॥ మానవా నీగొనము । మంచితెల్పెదవినుము । కానిపోనికోపమీ వీ । కరణిఁజూపరాదుఘన ॥మానే॥ కొంటెలమారినీ । గొనమెల్లఁదెలసె మొగని । పొంటెదిగులు । కొంటెవఁట జంటకానినెఱువుగనౌఁనంగెన ।నౌనె॥ భూమిపై యీపింత । లేమెఱుఁగవెనుఁతే । ప్రేముడివెన్నెలరేలు । భీతి తోఁచునంటివఁట ॥యెందు కేనంగనాచి॥ చేడియానామాట । చెవియొగ్గి పెరవలిపీట । గూఢకృష్ణకవినిబ్రోచెడి। గూఢపాద్భామణు వేఁడవే ॥ఔనౌనేసంగనాచి॥

౬. ప్యారెప్యారోబనా యోబనా యోబనా – అనుమట్టు.

చాలుచాలేసఖి । సరసీజముఖి । కాలకాలముల

నుఁజూపవలదా । పోనీ । పెద్దపిన్నలభయయముకలదా । వలదా । ఆ । హా । హా ॥చాలు॥ పంటవలంతిపై సిట్లు సేయఁగా । నీదు । కొంటెతనముమాకుఁదెల్లమయ్యెగా ! బాగుగా । న । య్యా । రే ॥చాలు॥ కాందిశీకమిట్లువిడచితేలనేయప । నింపలపాల్పడఁజెల్లునే । తగునే । ఔరా । రా ॥చా॥ మందెమేలములాడనీకు । ధర్మమా । నీదఃచంపమిటులొౌటపాపకర్మమా । మర్మమా । భ॥ళి॥రే ॥చాలు॥ గూడకృష్ణయాఖ్యునిజో)చుహారిని । సుంత । వేఁడఁజూడపిఁకఁదెన్నెదని । ధారుణి । ఔరౌర ॥చాలు॥

7. కాఫీ—చాపు.

చాలునీయుపన్యాసము । పడనేల యిటు రోసము ॥చా॥ బాలికామణిజెసి । మాలిమాటాడకే । వాఁలాయ । మీలాటిగోలనీకేల ॥చా॥ సదమునఁ జేరికు । ల్కెడవెంతదానవే । అదిరా । నిను । మదిరా । ఛీ! పదరుబోతనరా ॥చాలు॥ చెన్నఁటీవైనాతో । నిన్నిమాటలాడ । కున్నసకిమిన్న । నీకు । బన్నమేమన్న ॥చాలు॥ గూడకృష్ణకవి । నేలుహరిదయ । వీడఁజెరలాడనీ॥ప్రోడ॥ తనమేల ॥చాలు॥

8. వన్నెకాఁడ చెన్నరాయ భూపాల-అనుమట్టు.

ఎంతదానవబలా । నీ ॥వెం॥ నీ । కింతభ్రాంతియే

లు | లేనిగోల ||ఎం|| కూళతనముమాను | బాలా! యీన భలోను | కాలమనియుఁ | గాలము కాదనకను | వేలుపు సొగసుల || నేలంజేసెన ||వెం|| నెయ్యమరయరాదా| నీకియ్యదిమరియాదా | కయ్యమూనిలాఁతివారితో | నీ | వొయ్యనఁబోవఁగ | నెయ్యది తెలివగు ||నెం|| గూడకృష్ణకవిని | మది | కోరిబ్రోచుహరిని | వేఁడినచోనీ | వాడుకొండఁగుచుఁ || జేడెలవలెనీ | పోడిమి హెచ్చును ||ఎం||

## పూ ల చెం డ్ల పా ట లు.

ముద్దుబెట్టరాదటే—అనుమట్టు.

పూఁలచెండ్లాడ వె | పూబోఁణిధవునితో | బాలికామణిమల్లె | పూలబంతిని వెసఁ, గేలఁదాల్చిచెల్వొని | కేలగమిాను౦చుమ ||పూ|| ధరణీదేవులుమంత్రా | ర్థములనుఁజదువఁగ | సురదుందుభీనిస్వన | మురజలు | మోయఁగఁ ||బూ|| వారాంగనామణులు| వరనాట్యవిధులను | మేరమిారఁజూపఁగ | మృగనేత్రకొనబుగఁ ||బూ|| గూడకృష్ణకవిని | కోరిబ్రోచుశ్రీహరి | చేడియనీముఖపు | చెల్వమునకలర ||పూల||

2. వది జంఝూటి—రూపకం.

తనిచను వెనయఁగఁ నతి । కాదెమానినీ ॥బం॥ కాంతనో
చే, మంతిపూలు । కందుకముత్రన , దంతివరదు, నురము
నాటఁ , దార్చుమా వెనక ॥బం। కలికిరొంచియనగ వెగయ
గీ) । గంటిచూపులక ॥ జెలుపుని దెస । నలఁతిఁగన్గొని।
సింగారంబుగక ॥బం॥ తడసిననినువిభుఁడుకోప । పడఁగ
నౌసుమీ । బడ లేదెనీపి)యుని (మోలఁ బాటలాధరీ ॥
బం॥ ధరణిగూడకృష్ణయాఖ్య , వరఁదుఁడేమని । నెంఁన
లఁచునో నీనుచలము । నరసికామినీ ॥బంతులాడ॥

3. నది ఈథన మేమరి యాధసమే—అనుమట్టు.

పూలచెంగమనమాడుదమా । పూఁబోణిరొకప
గూడుదమా । బాలామణినీవినవినుమా । బదులునుదువ
యోచింపకుమా ॥పూల। పోలనీకునాకునునీడే, పుగు
పోత్తను! నన్నిటులాడె । దేలయుంటి నేనలనాఁ। డే వీలుప
డదుచనుమిదివా దేపో ॥ బేలమాటలాడకుననబోణీ ।పూ
లబంతులాటనీకునీడేమి । కాలమేలగడపెదుకలవాణీ । కే
లునాఁచుమరమరమాని॥పూ॥ పసిదాననుసుమకందుకము
విసరకుమానా । పైకరము । వెసనాదగుమన వినివిను
ము । పొసఁగనిజతనముఁ సేయకుము ॥పోల॥ అళికచ!యి
టులాడెద వేల , కలఁచెదునే మదినదమిలా । యలరుబం
తిఁదాల్చుము । కేలా । నిలువఁజాలనలఁతియుగోలా ॥

పూల॥ ఎంతనియేబ్రతిమాలెదను, దంతివరదయిదె మ్రొ
క్కెదను । వింతవారలిదిగనియికను । సంతపెట్టుదురు వీ
ధులను ॥ పో॥ వింతవారికిటు వెఱువఁగను । వెలఁదియనవ
సరమియ్యఁదనుగొంతి! సుతనాదెసఁగనుము । గూడకృ
ష్ణకవిపోషుఁడను ॥పూల॥

4. పది కియాము——ఆది.

ప్రాలేయగిరికన్యకాయాఁడుదామా । పూలబంతు
ల, మేలయినమల్లెమొల్లలలోడఁ దనరారుమేటిజాజుల ॥
బా॥ భేరిమర్దళదుందు, భినాదములుభోరుకొలుగఁగా ।
వారకామినులుసింగారంపుఁబద్దెముల్ । పాడియాడఁగా।
పా॥ బాడబులుదీవెనఁబ్రాలుతమకేల । దాలిచికదుర్ ।
వేఁడుక జనింపవేదోక్త మంత్రాశీస్సులోలినుడువర్ ॥
బా॥దుగపుట్టువులమై, దువులుఁజయధ్వానులు । నిగుడఁ
బాడఁగా, మృగశాబకాక్షి నెక్కుముదంబునమేను । గ
గురుఁజెందఁగ ॥బ్రా॥ తెరగంటిదొరలు పొరిపొరిని మన
పైనివిరులఁదల్లఁగర్ సరసిజానన! సరసనల్లాపములలాఁతి,
తెలివలాడఁగర్ ॥పా॥ ప్రీడఁజెందఁగనేల: బాలాసుశీలా
వేమరునిటగూడకృష్ణాఖ్యు నేలేడిశంకరుండనింకేల య
లసట ॥పా॥లేయమగిరికన్యకా॥

## లాలిపాట—మధ్యమావతి—ఆట.

లాలిరవికులచంద్ర। లలితగుణసాంద్ర । లాలిన తమానీంద్ర। శ్రీరామచంద్రా ॥లాలి॥ జనకసుతాకుచ స్తబకాతిలోలా , మునిమనోబ్జవిహార। వినుతగుణశీల ॥ లాలి॥ కౌసల్యాగర్భవా। రాసిహోమధామా । వాసవాదినిలింప। వర్గనుతనామా ॥లాలి॥ లలితశమదమసార। విలసితోరా । జ్వలితఖలకాంతార । దశరధకుమార ॥లా। పిశితాశనకులాగ । శోభనసుశీలా । కుశలరూపకమహా। తిశయగుణజాల ॥లాలి॥ చామీకరగిరీంద్ర । సన్నిభగభీరా । సౌమిత్రిహృదయప జ్జరదివ్యకీర ॥లాలి॥ దశకంఠకంఠలుంఠిత బాహుమూల। కుశలవార్చితపాద। కువలయసుచేలా ॥లా॥ పెరవలిపురాం। తరసన్నివాసా । ధరగూడకృష్ణస । త్కవిమనోల్లాసా ॥లాలి॥

---

క॥ మంగళముపార్థివేశ్వర
మంగళముమహానుభావ! మంగళముశివా
మంగళముపార్వతీవర
మంగళముమహోత్సగమన! మనసిజదమనా॥

ఈపొత్తమునకు ద్రవ్యసహాయ మొనరించినవారి
నామసంఖ్యావివరము.

తూ ము లూ రు.

| | |
|---|---|
| శంకరమంచి నరసయ్యగారు. రు. | 1—0—0 |
| భాగవతుల వెంకటప్పయ్యగారు. | 1—0—0 |
| రొంపిచర్ల కృష్ణమాచార్యులుగారు. | 1—0—0 |
| నాగాచార్యులుగారు. | 1—0—0 |
| కొల్లి కృష్ణారెడ్డిగారు. | 1—0—0 |

కొల్లిపర.

| | |
|---|---|
| జొన్నల కోటిరెడ్డిగారు. | 1—0—0 |
| గుదిబండి రామచంద్రుడుగారు. | 1—0—0 |
| ఱ్యానరసింహంగారు. | 1—0—0 |
| యీగోపిరెడ్డిగారు. V. | 1—0—0 |
| యీనాగిరెడ్డిగారు. V. | 1—0—0 |
| వుయ్యూరు రామయ్యగారు. } | 2—8—0 |
| భీమవరపు చినగురవారెడ్డిగారు. } | |

చావలి.

| | |
|---|---|
| పోతుకుచ్చి లక్ష్మీనారాయణశాస్త్రిగారు. | 1—0—0 |
| చావలి శివరామయ్య. | 2—0—0 |
| మాజేటి వెంకటనరసింహంగారు. | 1—0—0 |
| గాజుల వెంకటసుబ్బయ్యగారు. | 1—0—0 |
| యీ వెంకయ్య. | 1—0—0 |
| యీరామకృష్ణయ్య. | 1—0—0 |

## పెరవలి.

| | | |
|---|---|---|
| చెరువు హనుమాయమ్మగారు. | | 1—0—0 |
| జంధ్యాల దుర్గాంబగారు. కొల్లూరు. | V. | 1—0—0 |
| వేమూరి రామకోటయ్యగారు. | | 1—0—0 |
| చావలి చంద్రయ్యగారు. | | 1—0—0 |
| కోటశ్రీరాములు. వాసుదేవుడు. | } | 0—8—0 |
| విష్ణుమొల్కల వెంకటరెడ్డిగారు, గ్రామమునసఫ్. | | 1-0—0 |
| విష్ణుమొల్కల వెంకటకృష్ణయ్యగారు. | | 0—8—0 |
| మత్తె సుబ్బయ్యగారు. | | 1—0—0 |
| లింగినేని బసవయ్యగారు. | | 1—0—0 |
| దాది బసవయ్యగారు. | | 0—8—0 |
| దాది సూరయ్యగారు. | | 0—8—0 |
| జొన్నకూటి అప్పయ్యగారు. | | 0—8—0 |
| దండె అబద్ధాలుగారు. | V | 1—0—0 |
| కంభాల అప్పయ్యగారు. | V | 1—0—0 |

## పెరవలిపాలెం.

| | |
|---|---|
| విష్ణుమొల్కల యల్లయ్యగారు. | 1—0—0 |
| చవ్వాకుల వేంకటకృష్ణయ్యగారు. | 1—0—0 |
| చవ్వాకుల కృ॥ కో॥ కోటయ్యగారు | 1—0—0 |